# వేంగి చాళుక్యరాజ్య చరిత్ర



త్త భావయ్య చౌదరి
సంగంజాగర్లమూడి.

# వేంగి చాళుక్యరాజ్య చరిత్ర

## పద్యకావ్యము

( క్రీ. శ. 618 - 1076 )




గ్రంథకర్త:

**కొత్త భావయ్యా చౌదరి,**

దేవరహస్యాలు, కమ్మవారిచరిత్ర, రెడ్లచరిత్ర, కాశ్మీరదేశచరిత్ర,
కాకతీయరాజ్య చరిత్ర మున్నగు రచయిత.

# జన్మస్మృతి

(2-6-1897 జననం.)

హేవిళంబిని జన్మించి ♦ జ్యేష్ఠశుద్ధ
సాద్యమీ మృగశిర చతుర్థ ♦ పాద వృషభ
లగ్నమున దైవతాకృప ♦ రచయితనయి
షష్టిపరిపూర్తి నొందిన ♦ జ్ఞాపకార్థ
ప్రచురమీ వేంగిచాళుక్య ♦ సుచరితంబు.



## జాతకచక్రము

| | | | |
|---|---|---|---|
| | శు | ర, బు | చం |
| | రాశి | | కు, కే |
| రా | | | గు |
| శ | | | |

| | | | |
|---|---|---|---|
| | | | ర, రా |
| | అంశ | | శ, గు<br>శు |
| | | | |
| బు, కే | కు, చం | | |

# కవిత

౧

నవ్య మధురాతి మధురమౌ ♦ కావ్యమేని
ధర్మసత్యంబులకు విరు♦ద్ధముగ గూర్చఁ
బండితులు మెచ్చరద్దాని ♦ బ్రతిభఁ గనియు
రసికవరులైన, సత్యంబు ♦ రాణకెక్కు.

౨

పద్యమైన నేమి ♦ గద్యమైన మఱేమి ?
హృద్యమైనదాని ♦ నెంచుచుంద్రు
పద్య గద్యములకు ♦ భావంబె ముఖ్యమౌ
సత్యసుకృతి నిలుచు ♦ శాశ్వతముగ.

౩

రసికవర హృదయంబులు ♦ రంజిలంగఁ
బ్రకృతి సత్యముల్ వర్ణింపఁ ♦ బహుళముండఁ
బచ్చియనృతముల్ సెప్పిన ♦ ఫలమదేమి ?
సత్యచరితముల్ కవులకు ♦ జాలలేవె ?

౪

ఎట్టి రాజవరులు ♦ యేమతంబులవార
లెట్టిజనులు బుట్టి ♦ గిట్టినారో
యెట్టికాలములను ♦ యెట్లు చరించినా
రట్టి దేశచరిత ♦ నరయ వలదె.

౫

మాతృదేశ సదభి♦మానంబునుం బూని
మాతృభాషయందు ♦ మమతఁ గలిఁగి
మాతృదేశచరిత్ర ♦ మది నెఱింగిన వాఁడె
మాతృభక్తుఁ డండ్రు ♦ మహితజనులు.



# పీఠిక

దేశచరిత్రము లీకాలమున ధారణ లేనిదే విరివిగా ప్రజలలో ప్రచారము గావనితలంచి, కష్టముగ నిట్లుచాళుక్యచరిత్ర పద్యరూపముగ వ్రాసితిని. కాకతీయ రెడ్లచరిత్ర లిట్లే వ్రాసియుంటిని. చాళుక్య రాజుల కాలములో బ్రాహ్మణ శైవమతము బాగుగా విజృంభించెను. పోటీగా జైనమత ముండెను. బౌద్ధమత మదివరకే తగ్గిపోయెను. బౌద్ధ విశ్వవిద్యాలయములు నశించి, వానిస్థానమున వేదశాస్త్రములు నేర్పు వ్యక్తుల ఘటికాస్థానములు వెలసెను. వాని పోషణకై చాళుక్యరాజులు భూములనిచ్చి పోషించిరి. సత్రములు, దేవాలయములు వృద్ధిజెందెను. యోధు లగువారికిగూడ అగ్రహారము లొసంగఁబడెను. కవులు పోషింపబడిరి. 9వ శతాబ్దిలోనే కవిచక్రవర్తి బిరుదాంకితు లుండిరి. చతుర్వేద పారాయణులు, త్రివేదులు, ద్వివేదులు సాధారణముగ నుండిరి. దేశ మీవిధముగ వైదిక విద్యావ్యాప్తితో నుండెను. దేశికవిత (ఆంధ్రము) 9వ శతాబ్దినుండి శాసనములలో గనబడుచున్నది. అద్దంకి, బెజవాడ శాసనములలో సీసములు, మంజరీద్విపదలు, తరువోజలు వ్రాయబడినవి. జైనమునుల పేర్లు కొన్ని వినవచ్చుచున్నవి. రాజు లెప్పుడును యుద్ధములలో నిమగ్నులగుచు, తండ్రి తాతలనుండి వచ్చు వైరములను వృద్ధిజేసుకొనుచు, పరస్పరము కలహించుకొనుచున్నను, మతాభివృద్ధి కార్యములు సల్పుచునే యుండిరి. రాజ్యాధికారమునకై రాజకుటుంబములందు తగాదాలు హెచ్చుగనే యుండెను. వైరిరాజుల కట్టివి యనుకూలముగానున్నను ఆంధ్ర భూభాగములోని వేంగీదేశము వేంగీ, కమ్మమున్నగు రాష్ట్రము లతో విలసిల్లుచు, చాళుక్యరాజుల పాలనములో అవిచ్ఛిన్నముగా నాల్గు వందల యేబదియేండ్లు జరుగుట యప్పటి పరిపాలనా కట్టుబాట్లవల్లనే యని తెలియఁగలము. ఆకాలములో గజయుద్ధములు ప్రసిద్ధి వహించి యుండెను.

దేశము సుభిక్షమై, రాజులసంపద లభివృద్ధిగా నుండుటవల్లనే రాజులనేక తులాభారములను దూగి పంచిపెట్టు టాచారమయ్యెను. కులభేదము లున్నను, కొందర న్యకులముల లోనికి ధారాళముగా జేరి పోవుట యాకాలములో గానవచ్చుచున్నది. పట్టాభిషేక కాలములందు, గ్రహణకాలమందు రాజులు దానములిచ్చుట పరిపాటియయ్యెను. శాలివాహనశకము, సంవత్సరాలపేర్లు అరుదుగా వాడెడివారు. సంస్కృతము రాజభాషగా నుండెనుగాని 7వ శతాబ్దినుండి తెలుఁగుగూడ అమలునకు వచ్చెను. దేశములో భూమికొలత యుండెను. నివర్తనాలు, ఖండికలు, పుట్లు అనుభాగము లాకాలమున గానవచ్చుచున్నవి. గద్యాణములు, మాడలు మొదలగు నాణెములు వాడుకలో నుండెను. మామూలు చరిత్రల కెక్కని విషయములిందు శాసనములను బట్టి విస్తరించి చెప్పబడినవి. ఈ చాళుక్యుల చివరికాలమున నాంధ్రభాష యున్నతస్థితికి వచ్చెను.

గ్రంథకర్త.



# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | వేంగీచాళుక్యులు, పులికేశి II | 1 |
| 2. | కుబ్జవిష్ణువర్ధనుఁడు | 3 |
| 3. | జయసింహనృపాలుఁడు | 5 |
| 4. | ఇంద్రవర్మ, 2వ విష్ణువర్ధనులు | 7 |
| 5. | మంగిరాజు I | 8 |
| 6. | రెండవ జయసింహ, కోకిలిరాజులు | 10 |
| 7. | మూడవ విష్ణువర్ధనుఁడు | 11 |
| 8. | వాసవీకన్య యుదంతము | 12 |
| 9. | విజయసిద్ధి | 13 |
| 10. | నాల్గవ విష్ణువర్ధనుఁడు | 15 |
| 11. | నరేంద్రమృగరాజు | 16 |
| 12. | కలివిత్తరరాజు | 18 |
| 13. | మూడవ విజయాదిత్యుఁడు | 19 |
| 14. | చాళుక్య భీమరాజు I | 22 |
| 15. | నాల్గవ విజయాదిత్యుఁడు | 24 |
| 16. | అమ్మరాజు విష్ణువర్ధనుఁడు VI | 24 |
| 17. | దాయాదుల పాలన | 26 |
| 18. | యుద్ధమల్లుఁడు | 27 |
| 19. | రెండవ చాళుక్య భీమరాజు | 27 |
| 20. | అమ్మరాజు II విజయాదిత్య VI | 28 |
| 21. | దానార్ణవుఁడు | 33 |
| 22. | బాదపరాజు | 34 |
| 23. | వేతవిజయాదిత్యుని వంశము | 36 |
| 24. | శక్తివర్మ I | 36 |
| 25. | విమలాదిత్య చక్రవర్తి | 38 |
| 26. | రాజరాజనరేంద్రుఁడు | 40 |
| 27. | శక్తివర్మ II | 44 |
| 28. | సప్తమ విజయాదిత్యుఁడు | 44 |




# వేంగి చాళుక్య రాజ్య చరిత్ర

## వేంగిచాళుక్యులు - పులకేశి II (610-642)

చంద్రవంశజులంచుఁ బ్ర ♦ శస్తిఁగనిరి
చలికికులజులు ఆంధ్రభూ ♦ తలములోన
శాతవాహనరాజ్యాన ♦ సంచరించి
రాణకెక్కె హిరణ్యరా ♦ ష్ట్రంబునందు. 1

ఆరవశతాబ్ది నుండియే ♦ వీరి చరిత
ఖ్యాతిఁగనె విజయాదిత్యుఁ ♦ డాదిపురుషుఁ
డతనిపిమ్మట నాల్గవ ♦ క్షితిపతియన
వరలుచుండును పులకేసి ♦ వాసికెక్కె. 2

కాళహస్తిపురీశ ము ♦ క్కంటి విభుఁడు
పల్లవాన్వయుతో బోరి ♦ పరముజెంది
నాఁడు యీవిజయాదిత్య ♦ నరవరేణ్యుఁ
డతని వంశమె ప్రఖ్యాత ♦ మై పెలింగె. 3

మానవ్యస గోత్రజుల స
మానులు చాళుక్యవంశ ♦ మాన్యులలోనన్
బూనిక కళ్యాణీనగ
రానను బులకేశినృపుఁడు ♦ రాజ్యముజేసెన్. 4

పరమ భాగవతులు ♦ పరమ బ్రహ్మణ్యులు,
మాతృపితృసేవ ♦ మసలువారు
అమల గుణగణాఢ్య ♦ హారీతపుత్రులై
వినుతికెక్కినారు ♦ వీరుపుడమి. 5

శ్రీహర్షవర్ధన ♦ క్షితిపతి నెదిరించి
దక్షిణాధిపతిగా ♦ దనరె నెవఁడు
నర్మదానదిదాఁక ♦ నరవరులందఱు
కప్పముల్ జెల్లింపఁ ♦ గ్రాలె నెవఁడు
కర్మరాష్ట్రంబును ♦ ఘనవేంగిరాష్ట్రముం
గొని సోదరునకిచ్చెఁ ♦ గూర్మి నెవఁడు
పృథ్వీవల్లభుఁడను ♦ బిరుదు మహారాజ
పదమును ధరియించెఁ ♦ బ్రతిభ నెవఁడు
ఇర్బులిగ్రామాన ♦ నిచ్చె నివర్తనా
లెనిమిదివందల ♦ నిచ్చ నెవఁడు
మాఁగనూరు నివాసియు ♦ బుధనుతుండు
వేదశర్మయనంబడు ♦ విప్రవరుని
కధికవిఖ్యాతి నార్జించి ♦ నట్టిఘనుఁడు
భవ్యచరితుండు పులకేశి ♦ పార్థివుండు. 6

శైవ బౌద్ధాది మతముల ♦ స్థానరమయి
కరితురంగాది బలముల ♦ ఘనతకెక్కి
సిరుల నెలవయి వైదిక ♦ వరులఁ జెలఁగి
వేంగిదేశంబు మిన్నయై ♦ వెలయు నపుడు. 7

విష్ణుకుండిరాజు ♦ విక్రమేంద్రుండేలు
వేంగిదేశమపుడు ♦ వీకతోడ
యజ్ఞయాగములకు ♦ నాలయంబనిపేరు
జెందె బౌద్ధమతము ♦ క్షీణపడఁగ. 8

బౌద్ధవిజ్ఞాన కళలకు ♦ పట్టుగొమ్మ
శిల్పనిర్మాణములకు ప్రబ ♦ సిద్ధపురము
ధాన్యకటకంబు నీనృపుల్ ♦ ధ్వంసపఱచి
బ్రాహ్మణమతంబు వృద్ధికై ♦ పాట్లుబడిరి. 9

విష్ణుకుండిరాజ్య ♦ వేంగిని పులకేసి
యాక్రమించి మించి ♦ యాహవమున
[1]పిష్టపురమునుండి ♦ వీకనేలందమ్ము
విష్ణువర్ధనునకు ♦ ప్రీతినొసఁగె. 10



## కుబ్జవిష్ణువర్ధనుఁడు (618–636)

దుర్గమంబులైన ♦ దుర్గాల సాధించి
విషమసిద్ధియంచు ♦ బిరుదునొందె
నితడుపాలన పదు ♦ నెన్మిదివర్షాలు
సలిపి వాసిగాంచె ♦ జనములందు. 1

తన దిగ్విజయార్థముగా
ననువుగ నితఁడశ్వమేధ ♦ యాగమొనర్చెఁ

1. నేటి పిఠాపురము.

జనపతు లాంధ్రమహీస్థలిఁ
గొనియాడఁగ నితనిశక్తి ♦ కుబ్జుండయ్యెన్. 2

పర్వదినములందు ♦ గ్రహణము లందును
భూమిదానములను ♦ పొలుపుమీర
బ్రాహ్మణోత్తములకు ♦ బండితులగువారి
కిచ్చి పేరుజెందె ♦ నృపతివరుఁడు. 3

వేదశాస్త్ర పురాణాది ♦ విద్యలన్ని
విష్ణుశర్మయు మాధవ ♦ విప్రవరుఁడు
నేర్చియుండినవారికి ♦ నియతినిచ్చె
మమతతో నగ్రహారము ♦ మత్స్యవంశ
అటవి దుర్జయుడిద్దాని ♦ నమలుపరుప. 4

పోతునూంక నివాసులౌ ♦ భూమిసురులు
నలుబదికిరా నివర్తనాల్ ♦ నాల్గునూర్లు
భూమినొసఁగెను కుములూరు ♦ గ్రామమునను
విష్ణువర్ధన నరపతి ♦ ప్రీతితోడ
కీర్తివర్మసుతుండను ♦ కీర్తిగాంచి. 5

అయ్యణామాదేవి యనియెడు ♦ నతనిరాణి
విజయవాడనడుంబినా ♦ పేరుగలది
భక్తినిర్మాణ మొనరించె ♦ వసతినొకటి
జైనదేవరలకుగాను ♦ సంతసమున. 6

కుబ్జవిష్ణునృపుని ♦ గొల్చుచు మేటిసం
గరములందు జేసు ♦ గన్నయట్టి

బుద్ధవర్మకిచ్చె ♦ భూరికొండపడమటి
సీమనేలుమంచు ♦ నీమమొప్ప. 8

కాలకంపండనెడి ♦ ఘనయోధసేనాని
పట్టవర్ధనాఖ్య ♦ వంశభవుండు
దత్తరాఖ్య నృపుని ♦ దర్పంబునం గెల్చి
యీనృపాలు గొలుచు ♦ నెపుడుభక్తి. 8



## జయసింహ నృపాలుండు I (636-669)

సీమలును నాడులును బెక్కు ♦ జేరియుండి
రాష్ట్రములు విషయంబులు ♦ రాణకెక్కె
దేశమున గొన్నిభాగముల్ ♦ దెలియంబడెడి
వీనికన్నింటికిని వేరు ♦ వేరునృపులు
గలరు సామంతులై సైన్య ♦ ములను గలిగి. 1

విష్ణువర్ధనుండు ♦ మృతినొంద జయసింహ
నామ సుతుండు రాజ్య ♦ నాథుండయ్యె
సర్వసిద్ధియంచు ♦ జనములు బొగడంగా
వినుతిజెందె నితండు ♦ పృథ్విలోన. 2

తనపేర సర్వసిద్ధి
ఘన నగరమ్మొండుగట్టి ♦ ఖ్యాతింగాంచెన్
జననుతుండాతండు పాలిం
చెను ముప్పదిమూడుయేండ్లు శ్రీలొప్పారన్.

ఇతఁడు త్రికళింగము జయించి ♦ నుతుల కెక్కి
దండయాత్రలలో తన ♦ ధాటిఁ జూపి
కనకమేఖల యను రాచ ♦ కన్య దెచ్చి
పెండ్లియాడెను జగదేక ♦ వీరుఁడగుచు
దండికవి వీనిచరితముం ♦ దఱచి వ్రాసె.

అయిదునూర్ల నర్వదియొక్క ♦ టైన శకము
హుయనుసాంగను చైనీయుఁ ♦ డొకఁడు వచ్చి
వేంగిదేశంబు గాంచగా ♦ దృష్ణగలిగి
కొన్ని నెల లమరావతి ♦ నున్నయంత
బౌద్ధమతచిహ్నములు ♦ పాడుబడుట జూచె.

బౌద్ధవిద్యాలయంబులు ♦ పాడువడిన
వేదఘటికాస్థలంబుల ♦ వెలయఁజేసి
వానిలో బోధలొనరించు ♦ బ్రాహ్మణులకు
పెక్కుచోటుల నిచ్చెను ♦ పృధ్వీనృపుఁడు.

వేదవేదాంగముల నేర్చు ♦ విప్రజనుల
కగ్రహారంబుల నొసంగె ♦ నన్నిదిశలఁ
దండ్రివలెనే యితండును ♦ దానధర్మ
శాలియై పేరుగాంచె నీ ♦ శీలవరుఁడు.

గుద్రహారంబునందున ♦ గుప్తశర్మ
తర్కశాస్త్ర ప్రవీణుఁడై ♦ తనరుచుండ
పెనుకపఱ్ఱను గ్రామమున్ ♦ బ్రీతినిచ్చె
నాజ్ఞ శివశర్మయను విప్రుఁ ♦ డమలుసేయ.

విద్యలను బ్రోత్సహించఁగా ♦ నుద్యమించి
కుక్కనూరునివాసి స ♦ ద్గుణగణుండు
వేదశాస్త్రప్రవీణుఁడౌ ♦ విప్రవరుఁడు
సోమశర్మకు కోంబట్టు ♦ గ్రామమిడఁగ
నచట నరసింహాశర్మయు ♦ నమలుపఱచె. 9

ప్రాకృతము సంస్కృతములతో ♦ బాటితండు
తెలుఁగుబాసను వృద్ధికిఁ ♦ దేఁదలంచి
రాజశాసనముల దెల్గు ♦ వ్రాయఁజేసె
రక్తివిప్పర్రు మొదలగు ♦ గ్రామములను. 10

వేదవేదాంగములలో బ్ర ♦ వీణులగుచు
మాఢికెక్కిన వారిలో ♦ రుద్రశర్మ
కాటిశర్మల కెక్కుడు ♦ గౌరవమున
రెండు గ్రామంబులిచ్చె నీ ♦ నృపతివరుఁడు
హస్తి వీరకోశులు దీసి ♦ నమలుసేయ. 11

---

## ఇంద్రవర్మ, రెండవ విష్ణువర్ధనులు (669-678)

తనయులు లేక నానృపతి ♦ ధారుణిపీఠినఁ దమ్ముఁడింద్రరా
జును నెలయొండు నేలి ♦ చన, సూనుఁడు రెండవ విష్ణువర్ధనుం
డును బ్రియమార వేంగిఁగొని ♦ దోర్బలమొప్ప చరించుచుండిపా
లన నవవర్షముల్ సలిపె ♦ రాజులలోన నితండె మేటినా౯.

త్యాగధేను బిరుదు ♦ ధరియించి యింద్రరా
జిచ్చె చండిశర్మ ♦ కెంతో భక్తి

కొండనాగురనెడి ♦ దండిగ్రామంబును
బోయవిప్రులకును ♦ నాయకుఁడని. 2

బోయలు బ్రాహ్మణులగుటను
రేయూరును గోరుకొన్న ♦ తేఁడొసఁగెఁ దమిఁ
జేయించి యగ్రహారము
వేయించెను శాసనంబు ♦ విష్ణునృపుండున్. 3

పమిడిముక్కలలో పల్లి ♦ వాడలోన
భావశర్మకు ధ్రువశర్మ ♦ పండితునకు
చంద్రసూర్య గ్రహణముల ♦ సమయమందు
భూములనొసంగి పేరొందె ♦ పుడమి తేఁడు. 4

సోమోపరాగమున నతి
సీమమ్మున పమిడిముక్క ♦ నేతయొసంగెన్
భూమిసుర కుత్తివర్మకు
నామోదముగల్గ ద్వాద ♦ శాత్మక ఖండుల్. 5

తనదు పేరటి నాణెముల్ ధాత్రి వెలయ
టంకసాలను వేయించె ధరణివిభుఁడు
మంగిరాజను తనయుఁడా ♦ మనుజపతికి
జననమొందెను ప్రజలెల్ల ♦ సంతసింప. 6

---

## మంగిరాజు I (678-703)

మరణమొందగ విష్ణువు ♦ మంగిరాజు
ధరణిఁ బాలించె నంతట ♦ దర్పమొప్ప

నిర్వదై దేండ్లు తనరాజ్య ♦ నిర్వహణకు
రాజధానిగా నెలమంచి ♦ గ్రామముంచి. 1

విజయసిద్ధి యనెడి ♦ బిరుదమునుందాల్చె
శత్రురాజవరుల ♦ సమరములను
పారద్రోలు కతన ♦ బహుపరాక్రమశాలి
మంగిరాజవరుఁడు ♦ వేంగివిభుఁడు. 2

అనఘువర్మయొక్కఁ ♦ డయ్యానవంశీకుఁ
డధికశౌర్యవంతుఁ ♦ డైనమేటి
కమ్మరాష్ట్రమందు ♦ ఘనతకెక్కినవాఁడు
శాసనముల నమలు ♦ జరుపునిచట. 3

మేటి రణరంగములటన్న ♦ గోటమీటి
జయముసాధించి యత్యంత ♦ సాహసమున
ననఘువర్మ సేనానియు ♦ నధికకీర్తిఁ
గొనియె దనభూవరేణ్యుండు ♦ కుతుకమంద. 4

కౌండిన్యస గోత్రజు లు
ద్దండులు షట్కర్మనిరత ♦ ధాత్రీసురులీ
మండలముల నివసింతురు
పండితులై బోయలందు ♦ ప్రతిభాన్వితులై. 5

చందలూరులోన ♦ చంద్రగ్రహణమున
బోయవిప్రులకును ♦ భూమినిచ్చి
ఖ్యాతిఁగాంచె నృపుఁడు ♦ నూతులపద్రులో
కుండి ద్రోణునకును ♦ గొంతయొసఁగి. 6

ఇతని శత్రులెవరో ♦ యేకతంబునగ్రై
రణములన్న దెలియ ♦ రాదుగాని
పశ్చిమోత్తరముల ♦ బాలించు నేతలే
వైరులంచు నుడువ ♦ వచ్చు మనకు. 6

## రెండవ జయసింహ, కోకిలిరాజులు (703-717)

రెండవ జయసింహనరేం
ద్రుండాతని జ్యేష్ఠసుతుఁడు ♦ యాధికనేలెన్
దండినృపాలుఁడు పదమూ
డేండులు విప్రజనభక్తి ♦ నిచ్చుచు భూముల్. 1

వెనుకపట్టున భూములఁ ♦ బ్రీతితోడ
నిచ్చెనెరద్రోణశర్మకు ♦ నిచ్చమెయిని
నాల్గువేదాల బఠియించు ♦ తెల్గువిప్రుఁ
డంచు జయసింహనరపతి ♦ యాదరమున
పృథ్విగాముఁడు దీనిని ♦ బ్రచురపరచె. 2

ఇతనిపిదప రాజ్య ♦ మేలెకోకిలిరాజు
షష్ఠమాసములును ♦ శ్లాఘ్యముగను
అతనిసోదరుండు ♦ నగు విష్ణువర్ధనుం
డంత వేంగిరాజ్య ♦ యధిపుఁడయ్యె. 3

విక్రమాదిత్య బిరుదము ♦ వెసధరించి
కోకిలియు రాజ్యమేలుచు ♦ గోర్కెనిచ్చె

నొక్క గ్రామము మంజేరు ♦ నుల్లసిల్లు
నట్టి దోపూడి విప్రుల ♦ యభిమతముగ. 4

కోకిలికి మంగిరాజను ♦ కొడుకుగల్గి
యగ్రహారం బొకండిచ్చి ♦ యశముగాంచె
నూటముప్పూరు బ్రాహ్మణుల్ ♦ నుతులొసర్చ
కొండుకవిలంగవాడనా ♦ గూర్చుపురిని. 5

మంగినృపతికి కోకిలి ♦ మనుమడగుచు
బుట్టి పేరొంది యొసఁగెను ♦ నెట్టువాడ
పురము బొట్టెరిగ్రామము ♦ భూసురులకు
బంచగా నశ్వశర్మయన్ ♦ బ్రాహ్మణుండు. 6

అనివారిత శక్తిత్రయ
ఘనసంపన్నుఁడని జనులు ♦ గై సేయంగా
మనుజవిభుఁడు విఖ్యాతిం
గొనె మధ్యకళింగభూమి ♦ కోకిలి నృపుడున్. 7



## మూడవ విష్ణువర్ధనుఁడు (717-753)

ముప్పదియారువర్షములు ♦ మోదముతోడుత నాంధ్రభూమిలో
నొప్పుగ రాజ్యమేలి బహు ♦ ళోర్వినిబ్రాహ్మణజైన బోధకుల్
మెప్పులుబొందుచుండ తమ ♦ మేటితనంబునుజూపి, వారికిన్
గొప్పగనగ్రహారముల ♦ గోరికమీర నొసంగె నీతఁడున్. 1

పెక్కుమారు లితఁడు ♦ ప్రీతితోడను తులా
భారములను దూగి ♦ బ్రాహ్మణులకు
హేమనిష్కములను ♦ హెచ్చుగాబంచిన
ట్లెన్నొ శాసనముల ♦ నెన్నఁబడియె. 2

వేంగినాటిలోని ♦ పెరవలి వాసియా
బ్రాహ్మణున కొసంగె ♦ గ్రామమొకటి
పసుపుబఱ్ఱునందు ♦ బ్రాహ్మణకేశవ
శర్మకిచ్చె భూమి ♦ సంతసమున. 3

సూర్యోపరాగమున నతఁ
డర్యేరను గ్రామమందు ♦ అత్తిలినాటఁగా
సూర్యనశర్మ కొసంగెను
ఆర్యపతంజలి సుగోత్రుఁ ♦ డని భూములనుఁగా. 4

ముసినికొండ గ్రామంబును ♦ బూన్కినొసఁగె
నతని ముత్తవ జైనదే ♦ వాలయమున
కంత నతని కుమారుఁడ ♦ త్యంతమేటి
విజయసిద్ధియు బాలించె ♦ వేంగిపృథ్వి. 5



## వాసవీకన్యయుదంతము

విష్ణువర్ధన నాముఁడౌ ♦ వేంగినృపతి
వాసవీకన్యకామణి ♦ వైశ్యకులజఁ

గోర్కి బెండ్లాడనెంచ పె ♦ న్గొండవైశ్య
జనములెఱరించిరట యట్టి ♦ సమయమందు. 6

దానికొడఁగి నృపుఁడు ♦ దాడియొనర్చిన
కన్యతోటి వైశ్య ♦ ఘనులు నూట
యిర్వరగ్నిదూకి ♦ యిహలోకమును వీడి
రంచు నొకపురాణ ♦ మందుగలదు. 7

పారిపోయినారు ♦ పరకులంబులఁజేర
వైశ్యజనము లేదు ♦ వందలకును
కమ్మవంశమందు ♦ గలిసిరిన్నూర్వురు
గొల్లలందు జేరఁ ♦ గొందఱుర్వి. 8

కులపిశాచ మిట్లు ♦ కొందఱవేధింప
వృత్తివర్ణచయమె ♦ వృద్ధియయ్యె
బోయవిప్రవరులు ♦ పుడమిని పల్లవ,
కమ్మబ్రాహ్మణులును ♦ గానబడెడి. 9

కన్యకను పరమేశ్వరి ♦ గాఁదలంచి
వైశ్యులందందు గట్టి దే ♦ వళములెన్నొ
పూజలర్ల సల్పుటకు నాడె ♦ మొదలువెట్టి
నేటికిని జేయుచున్నారు ♦ నిత్యసేవ. 10

---

## విజయసిద్ధి (753_772)

విజయాదిత్యుండనఁగా
విజయసుధీ యనఁబరగి ♦ విక్రముఁడై తా

విజయములఁ గాంచి రణములఁ
బ్రజలఁ బందొమ్మిదేండ్లు ♦ బాలించెదమిఁ. 1

తండ్రివలెనే యితండును ♦ దానధర్మ
ములనొసంగె తులాభార ♦ ములను దూగి
యితని కనుబొమల్ ముడివడ ♦ నెట్టిశత్రు
లైన నాశనమొందెద ♦ రాక్షణంబె. 2

రెండు వేదమ్ముల బఠించు ♦ దండివిప్రుఁ
డంచు మాధవశర్మకు ♦ నతఁడొసంగె
గుమ్మలూరున భూమిని ♦ గోర్కిమీర
నొక్కసోమోపరాగాన ♦ నుత్సహించి. 3

వేదములు నాల్గు నేర్చిన ♦ విప్రవరుఁడు
అతని తండ్రియు దాతయు ♦ నట్టివార
లంచు మాధవార్యునకిచ్చె నగ్రహార
మొక్కసూర్యోపరాగాన ♦ నుర్విభుఁడు. 4

ఉత్తరాయణ సంక్రాంతి ♦ యున్నమాస
మొక్క చంద్రగ్రహణమైన ♦ నుత్సహించి
సకరమఁ గ్రామమును ♦ దేవశర్మయనెడి
భూసురుండు కారంచేడు ♦ వాసికొసఁగె. 5

ఈరీతి వేదవిదులకు
కోరిన భూమిని ధనంబు ♦ గొల్లఁగ నిడుచుఁ
భూరియశస్కుండయ్యెను
ధారుణిపతి విజయసిద్ధి ♦ ధర్మనిరతిచేఁ. 6

విజయసిద్ధికి గల్గెను ♦ విష్ణువర్ధ
నుండనెడి పుత్రుఁడొక్కఁడు♦ద్దండుఁడతఁడు
రాజ్యభారంబు బూనెన ♦ రాతులదర
విజయసిద్ధియు బుడమిని ♦ వీడినంత. 7

## నాల్గవ విష్ణువర్ధనుఁడు (772-807)

నాలవ విష్ణువర్ధనుఁడు ♦ నాబడి సిద్ధికి పుత్రుఁడైన భూ
పాలుఁడు వేంగిదేశమును ♦ భవ్యత ముప్పదియైదువత్సరా
లేలెను కాలచుర్యత్రిపు ♦ రీశ్వరు పట్టిని బెండ్లియాడి, యా
పాలనలోన బ్రాహ్మణులు ♦ బాగుగ బోషణఁ జెందుచుండగన్.

పూర్వపు నృపతుల బిరుదముల్ ♦ బూనియితడు
వారివలె సంచరించుచు ♦ వాసిగాంచె
"పృథ్వీపల్లవపట్టణ" నేల నంత
దానముల్ సల్పి విఖ్యాతిఁ ♦ దనరె నితఁడు. 2

పన్నెండువేలగ్రామము
లున్నవి యితఁడేలు వేంగి ♦ లోన నటంచున్
మున్నుండిన శాసనముల
నెన్నంబడె నితనిశక్తి ♦ యెంతో దెలియన్. 3

ఇతనికిన్ విజయాదిత్య♦నృపతివరుఁడు
తనయుఁడు జనించి మిక్కిలి♦దర్పశాలి

నాగ బేరొంది తండ్రియ ♦ నంతరంబు
వేంగిసింహాసనంబెక్కె ♦ వేడుకలర.



## నరేంద్రమృగరాజను విజయాదిత్య II (807-847)

విష్ణువర్ధనసూనుఁడౌ ♦ విజయనృపతి।
వేంగిరాజులందఱికన్న ♦ వీరవరుఁడు
నూటయొన్మిది రణములం ♦ గోటమీటి
జయము సాధించె, సాహస ♦ చక్రవర్తి.

కట్టించె నేరాజు ♦ ఘనశైలదేవాల
యముల నూటెన్మిది ♦ నన్నిదిశలఁ
బోరాడె నేనేత ♦ పుడమికై మహిశూరు
గాంగరాజులతోడ – ఘనతఁజూపి
యెదిరించె నాజిలో ♦ నేనృపాలుఁడు వీక
గోవిందుఁడను రాష్ట్ర ♦ కూటరాజు
పన్నెండువర్షముల్ ♦ ప్రబలయుద్ధంబుల
నేకదీక్షవహించి ♦ యెవఁడుపోరె
సహజన్ముఁడగు భీమ ♦ చలికి విరోధించ
నశియింపఁజేసె యే ♦ నరవరుండు
రాజపరమేశ్వరుఁడు నరేం♦ద్రమృగరాజు
త్రిభువనాంకుశుఁడు విజయా ♦ దిత్యనృపతి
వసుధఁబాలించె నలుబది ♦ వత్సరాలు
తండ్రిమించినవాఁడె యీ ♦ తనయుఁడనగ. 2

చలికివిభుండు భీమనయు ♦ సాహసమొప్పఁగ రాష్ట్రకూట భూ
తలపతి సాయముంగొనుచు ♦ ధారుణీనాథు నెదిర్చి యాజిలో
దొలఁగఁగఁద్రోచి పాలనము♦దోర్బలమొప్పనొనర్చె గొన్నియే
డులు తుదకాతనిం దరిమి♦డుల్చెను శత్రునికాయ మీతఁడున్.

ఒక్కసూర్యోపరాగాన ♦ నుత్సుకతను
పల్లభట్టారకునకిచ్చె ♦ వంద్రుపేట
పద్మభట్టారకున కతి ♦ భక్తిఁ జెలఁగ
భూములనొసంగి పేరొందె ♦ పుడమివిభుఁడు. 4

కొత్రపట్టనుగ్రామము ♦ గోర్కెనొసఁగెఁ
హైహయాన్వయ నృపరుద్రుఁ ♦ డమలుపరుప
యిర్వదియునాల్గు విప్రుల ♦ యిచ్చనెఱిఁగి
వృద్ధమండఁడు ద్రోణుఁడన్ ♦ విప్రులకును
తాండివాడ గ్రామంబును ♦ దానమిచ్చె. 5

దేవాలయముల విప్రుల
నీ విధముగ వృద్ధిజేసి ♦ యెసఁగెడు ప్రతిభల్
దైవారగ భువినేలుచు
దావైరినృపాలురకును ♦ ధర్మ్మం డయ్యెన్. 6

ఇతఁడు కలివిష్ణువర్ధన ♦ సుతునిగాంచి
వేంగి బాలించి మించెను ♦ వీకతోడ
నీనరేంద్రుఁడు పరమున ♦ కేగినంత
నతని పుత్రుఁడు కలివిష్ణు ♦ వధిపుఁడయ్యె. 7



## కలివిత్తరరాజు (847-848)

కలవిత్తర రాజను నితఁ
డలఘుం డొనరించె పిదప ♦ నాపాలన న
ట్టులె యొకటిన్నర వత్సర
ములు మాత్రమె వేంగిలోన ♦ మోదము తోడన్. 1

మత్తమాతంగ రణముల ♦ మహితశక్తి
నశ్వసైన్య పోరాటము♦లందు రక్తి
గలిగి వీరగజాశ్వుడై ♦ మెలఁగికీర్తి
గనియె నీభూవరుండును ♦ జనపదముల. 2

రాష్ట్రకూట కన్య ♦ రంజిల్లు శీలమ
దేవిఁ జెట్టఁబట్టి ♦ తేజరిల్లి
గుణగ విజయుఁ గాంచె ♦ కొమరుండు బహుపరా
క్రముఁ డటంచు బేరు♦గనియె నపుడు. 3

విష్ణువర్ధనుఁ డనుపేర ♦ వేంగినేలి
యతఁడు పేర్మజిలీ గ్రామ♦మందు నొసఁగె
ద్వాదశాత్మక ఖండులు ♦ బ్రాహ్మణుఁడగు
నగ్నిశర్మకు చంద్రగ్ర♦హణమునఁ నందు

నమలు సేయఁగ జయరూప ♦ యనెడివాఁడు. 4

కలివిష్ణువు మరణించగ
నిల విజయాదిత్య నృపతి ♦ యేలిక యయ్యెన్
దలిదండ్రుల మరపించెడి
విలసన్నుత పాలనంబు విశ్రుత పఱుపన్, 5

## మూడవ విజయాదిత్యుఁడు (848-891)

ఇతఁడు పట్టాభిషిక్తుఁడై ♦ యెసఁగువేళ
బూర్వరీతి తులాభార♦ములను దూఁగి
పంచె నాధనరాసులు ♦ బ్రాహ్మణులకు
వైభవాస్పదుఁ డైనట్టి ♦ ప్రభుఁడనంగ. 1

తండ్రి తాతల కాలాన ♦ దఱచు గల్గు
యుద్ధరంగంబు లందు స♦న్నద్ధుఁ డగుచు
గాంగరాజులతోఁ బోరి ♦ కాంచె జయము
మంగివైదుంబు జంపె ని♦ర్మమత నాజి. 2

విక్రమ ధవళుఁడై ♦ బిరుదాంక భీముఁడై
పరచక్ర రాముఁడై ♦ పరగుచుండి
మనుజపరాక్రమ ♦ రణరంగ శూద్రక
యరసంక కేసరి ♦ యనఁగఁ జెలఁగి
నృపతి మార్తాండుఁడై ♦ భీమబలుండయి
యపర చాళుక్యార్జు♦నా యనబడి
భువన కందర్పుఁడై ♦ భూరియశస్కుఁడై
వైదుంబనోలంబ ♦ వల్లభారి
త్రిపుర మర్త్యమహేశ్వరా♦ది బిరుదముల
దాల్చి వీరాగ్రగణ్యుఁడై ♦ తనరుచుండి
పాండురంగ సేనానియు ♦ ప్రబల రణము
లందు బాల్గొన జయముల ♦ నందె నితఁడు. 3

కోసలేంద్రుని గజములం ♦ గొన్ని గొనుచు
పాండ్య కాళింగ గాంగుల ♦ పల్లవనృప
సంపదల హరియించుచు ♦ శత్రుభీక
రుండగుచు పేరుగాంచె నీ ♦ దండినృపుడు. 4

గుణగవిజయాంకుఁడని పేరు♦గొనియితండు
రంజిలగ విజయవాడను ♦ రాజధాని
చోళరాజును రక్షించి ♦ శూరుఁడగుచు
కిరణపురమును నెల్లూరు ♦ పురమచలము
గాల్చె చండప్రచండుఁడై ♦ కదనములను. 5

తెలుఁగుబాసఁ గవిత్వము ♦ వృద్ధిసేయ
బద్యశాసనములఁ గొన్ని ♦ వ్రాయఁజేసె
పాండురంగసేనాని యీ ♦ పనికిబూని
వ్రాసె నద్దంకి మున్నగు ♦ శాసనములు. 6

సోదరుండగు నృపశాము ♦ మోదమునకు
సంతలూరును బ్రాహ్మణ ♦ శతమునకిడె
వేదవిదులు కళానిధుల్ ♦ వీరినెఱిఁగి
విజయభూపతి విద్యావి ♦ వేకసుమతి. 7

ధర్మవరమునందు ♦ తనపేర బెజయేశ్వ
రాలయంబు గట్టి ♦ యందుదగిన
మఠము నొకటి బెట్టి ♦ మతపోషణమునకై
విజయరాజు దాని ♦ వృద్ధిఁజేసె. 8

కందుకూరును బెజవాడ ♦ కట్టమాది
కోటలం బెట్టి పన్నెండు ♦ కొండలపయి
బోయరాజగు వసుబోయ ♦ బొందియుండ
పాండురంగ సేనాని లో ♦ బఱచుకొనియు.
ధర్మవరదేవునకు భూమి ♦ దానమిచ్చె. 9

పద్మశివుఁడను మఠకర్త ♦ వశములోని
శకటమంతని నాడులో ♦ స్థాపితమగు
శైవభిక్షామఠంబు దే ♦ వళమునకును
గొంతభూమి నొసంగెను ♦ గోర్కి మీఱ
విజయభూపతి శైవంబు ♦ వృద్ధిఁ గొఱకు. 10

తాండపట్టను గ్రామముఁ ♦ ధరణిసురుఁడు
మంత్రతంత్రాంగముల మేటి ♦ మహితయశుఁడు
వినయధీశర్మ కిచ్చె నీ ♦ విభుఁడు ప్రేమ
పాండురంగఁడు దీనిని ♦ బ్రచురపరచ. 11

పదునార్వురు బ్రాహ్మణులకు
ముదమునని సె నిర్వర్ణూరు ♦ భూముల భూపుం
డదె శాసనంబుఁ జేయుచు
విదితుండగు పాండురంగ ♦ విశ్రుతపరచెఁ. 12

కడియరాజు సుతుండన ♦ ఘనతకెక్కి
పీక 'రణమర్ద' బిరుదంబు ♦ నృపతియొసఁగ
ఘోరరణరంగములలోన ♦ బోరుచుండి
ప్రతిభఁగాంచెను సేనాని ♦ పాండురంగ. 13

పాండురంగఁ డీరీతిని ♦ ప్రబలరణము
లందు బాల్గొని హతుఁడైన ♦ యాత్మశాంతి
కగ్రజులు నూరునైద్గుర ♦ కగ్రహార
మిచ్చె కోడంపురుగ్రామ ♦ మిచ్చ నృపుఁడు. 14

నలుబదియు నాల్గువత్సరా ♦ లెలమినిట్లు
వేంగిబాలించి ధారుణి ♦ వీడనృపతి
యితని శత్రులు దాయాదు ♦ లేకమైన
వీరల నణంచి చాళుక్య ♦ భీమనృపతి
రాజ్యభారంబు బూనెన ♦ రాతులదర. 15



## చాళుక్య భీమరాజు I (890-920)

శాలివాహనశక మష్ట ♦ శతము దాటి
పదియు నాలుగు వత్సర ♦ ప్రథమమందు
తనదు పట్టాభిషేకము ♦ దర్ప మొప్ప
భీమచాళుక్య నృపతిగా ♦ వించుకొనియె. 1

అట్టికాలాన కూకిప ♦ ట్టనెడు గ్రామ
మగ్రహారముగా పోత ♦ మయ్యయనెడు
బ్రాహ్మణునకిచ్చి పేరొందె ♦ ప్రభువరుండు
బాండురంగని పౌత్రుఁడు ♦ బాహుబలుడు
కడియసేనాని ప్రకటించ ♦ గ్రామమందు. 2

లాట కర్ణాటులును* రాష్ట్రకూటనృపతి
కృష్ణవల్లభుఁడాదిగా ♦ బెక్కునృపులుఁ
దండయాత్ర లొనర్పఁగాఁ ♦ దఱిమికొట్టి
యంత 'ద్రోణార్జున' బిరుదు ♦ నమరఁదాల్చి
ముప్పదేండ్లు పాలించెను ♦ మోదమలర. 3

నిత్యమును పోరుగానుండ ♦ నృపవరుండు
మూఁడువందల యెనుబది ♦ పోరులందు
జయము సాధించి వేంగిలో ♦ జనపదముల
నేలినట్లు శాసనముల ♦ నెఱుకపడెడి. 4

ఈవిభునిగొల్చు సామంత ♦ నృపవరుండు
ఎరియసేనాని వెలనాటి ♦ నేలుచుండు
నతనికొమరుండు మల్లన ♦ యల్లెనుండె
యుద్ధరంగములందు బ్ర ♦ సిద్ధులగుచు. 5

నిరవద్య పురమునందున
పెరువంగూరు రణమునను ♦ భీకరుఁడయ్యెన్
''యిరిమర్తగండ'' కొమరుఁడు
మరణించెను వానిసాటి ♦ మరి లేరనఁగన్. 6

బవరమున జంపి పేరొంది ♦ వల్లభేంద్రు
దండియోధుఁడు దండెన ♦ గుండయాఖ్యు
నంత యుద్ధగజంబుపై ♦ నతఁడు బడియె
వ్యూహమున నభిమన్యుని ♦ బోలుచుండి. 7

---

* పశ్చిమచాళుక్యులు

వీరవర్యుఁడా పుత్రుని ♦ మృతికి వగచి
నిత్యశ్రాద్ధ మొనర్చుచు ♦ నియతముగను
వెదతలూరను గ్రామము ♦ విప్రజనులు
నలుబదైద్దురకిచ్చె నీ ♦ నరవరుండు. 8

---

## నాల్గవ విజయాదిత్యుడు (920 A. D.)

భీమచాళుక్య నరపతి ♦ పృథ్విఁబాయ
వీనిపుత్రుఁడు నాల్గవ ♦ విజయుఁడంత
షష్ఠమాసముల్ బాలించె ♦ చతురుఁడగుచు
నరవి 'కొల్లభిగండఁడన్' ♦ బిరుదుదాల్చి. 1

ఘన తులాభారములఁ దూగి ♦ కాంచనమున
బంచె నాధనరాసులు ♦ బ్రాహ్మణులకు
దేశరక్షణ కార్యముల్ ♦ దృఢ మొనర్చె
భండనాదిత్యసేనాని ♦ బాహుబలుఁడు. 2

గాంగనృపాలుండొకఁడు క
ళింగము నేలుచును విజయ ♦ నృపునెదిరించన్
వేంగిపయి వెడలఁగా మా
తంగరణంబున జయించె ♦ దర్పంబొప్పన్ 3

---

## అమ్మరాజు I (6 వ విష్ణువర్ధన) 920–927

రాజమాహేంద్రపురియందు ♦ రాజధాని
నేరు పరచియు దేశాభి ♦ వృద్ధినెంచి

విజయభూపతి పిమ్మట ♦ వేంగినే[illegible]
నమ్మరాజేను వర్షముల్ ♦ సమ్మత[illegible] 1

అతని పట్టాభిషేకమం ♦ దాదరించి
పట్టవర్ధనకులజుఁడై ♦ ప్రతిభఁగాంచు
కుంతసేనాధిపతికిని ♦ గుంటురుపురి
పాళెములను పన్నెంటెని ♦ బ్రతిభనొసఁగె. 2

ఇఁక మహాకాలసేనాని ♦ కిచ్చెనృపుఁడు
గ్రామమొక్కటిఁ దుజ్జూరు ♦ గరుణతోడ
యితఁడు చాళుక్య భీముని ♦ కిష్టభృత్యుఁ
డగుచు వరుసగా రాజ్యంబు ♦ నందెయుండ
కటకరాజమల్ పరుపంగ ♦ గ్రామమందు. 3

రట్టవంశీకుఁడిందప ♦ రాజొకండు
తనకు సామంతుఁడైయుండ ♦ వినయమొప్ప
నృపవరేణ్యుండు పులివఱ్ఱు ♦ నిచ్చెఁబ్రీతి
నగ్రహారంబుగాఁజేసి ♦ యాదరమున. 4

కోరిమయ్య మంత్రి ♦ కోరినయలవఱ్ఱు
గ్రామమొసఁగె నృపుఁడు ♦ గౌరవమున
బాళ్కసమున నితఁడు ♦ ముఖ్యగణాంకుఁడై
నృపుని తల్లివలన ♦ బెంచఁబడియె. 5

బ్రాహ్మణులకన్న సేనాధి [illegible]
గ్రామములనిచ్చి రాజ్య ర ♦ క్షణము దలఁచి.

యమ్మరాజేలె బహుజన ♦ సమ్మతముగ
నతఁడు మృతిఁజెంద తారుమా ♦ రయ్యెనపుడు
తగవులాడఁగ దాయాది ♦ ధరణినృపులు. 6

## దాయాదుల పాలవ (927-928)

వేంగిదేశము నేలు ♦ పెద్దలెవ్వరు లేక
పక్షము దినములు ♦ దీక్షతోడ
తాని హారసుఁడని ♦ ధర బేతవిజయుండు
పాలించుచుండ నా ♦ బాలుఁద్రోచి
తాన కర్తనటంచు ♦ తాడపనృపుఁడంత
యొక నెల గొనియెనా ♦ యుర్వి వేంగి
యాతనిం బరిమార్చి ♦ యనివిక్రమాదిత్యుఁ
డేలెను పదకొండు ♦ నెలలు దీక్ష
అతని వెడలనడఁచి ♦ యమ్మరాజుతృతీయ
తనయుఁడైన భీమ ♦ ధరణిపతియు
నేలె వేంగిరాజ్య ♦ మెనిమిది నెలలంత
నాజి యుద్ధమల్లుఁ ♦ డతనినోర్చె. 1

దాయాదుల పోరాటము

నీయుర్విని హెచ్చిపోయె ♦ నిటుపాలనకై
నాయుద్ధములం దితరులు
చేయూత నొసంగకుండ ♦ నుండుటగననా. 2

## యుద్ధమల్లుడు II (928-933)

తాళరాజుసుతుఁడు ♦ ధారుణినేలె నీ
యుద్ధమల్లుఁ డంత ♦ యూర్జితముగ
సప్తవర్షములను ♦ జనరంజకంబుగా
నింత మరల బవర ♦ మేగుదెంచె. 1

విజయవాడను దెలుఁగున ♦ వెలయఁజేసె
పద్యశాసన మీతఁడు ♦ ప్రజలుగనఁగ
కొమరుసామికి దానంబు ♦ గోర్కెనిచ్చి
పాండురంగఁడద్దంకిని ♦ వ్రాసినట్లె. 2



## రెండవ చాళుక్యభీమరాజు-7 వ విష్ణువర్ధన (933-945)

కొల్లభీగండ బిరుదాంకు ♦ కొమరుఁడగుచు
నృపతిగా చాళుక్యభీముఁడా ♦ వేంగినేలె
రాష్ట్రకూటసైన్యముల ని ♦ రాకరించి
యుద్ధమల్లుని నిర్జించి ♦ యుద్ధమందు. 1
వీక "కరయిళ్లదాత"ను ♦ పేరుఁజెంది
వసుధ మాధవసోమయ ♦ జ్యాసుతుఁడైన
విద్దమయ్యను విప్రుని ♦ విద్యఁగాంచి
దిగ్గుబజ్జను గ్రామమ్ముఁ ♦ దీవి నొసఁగె. 2

వేంగి దాయాది నృపులలో భేదమరసి
తగిన యదనని రాజ్యంబు ♦ దానుబొంద

దలఁచి పశ్చిమచాళుక్య ♦ ధరణినేత
వెడలె సైన్యసమేతుఁడై ♦ విక్రమించి. 3

ప్రథిత చాళుక్య నృపదళ ♦ వాయులైన
బిజ్జ, యయ్యప, ధలగ, ♦ గోవింద, లోక
భిక్కి, రాజమయున్ దాత ♦ భిక్కిల నెడి
వీరులన్ యుద్ధమల్లుని ♦ బోరిలోన
నితఁడు బారంగఁ ద్రోలి యు ♦ న్నతిఁ జెలంగె. 4

అత్తరి మహాజనంబులు
నుత్తమమగువార గోష్ఠి ♦ నుత్సాహముతో
జిత్తము లలరఁగ సల్పుచు
నత్తెరగున దోడుపడఁగ ♦ నధిపతి యొప్పెన్. 5

నాలవ విజయాదిత్యుఁడు
మేలాంబికయందు గన్న ♦ మేటి కొమరుఁడై
యేలెను వేంగిరాజ్యపు
నేలం బన్నెండు యేండ్లు ♦ నృపుఁ డిట్లంతన్.



## అమ్మరాజు II (విజయాదిత్య VI) (*945-970)

లోకమాదేవి సుతుఁడన ♦ రూఢికెక్కి
యమ్మరాజను సుతుఁడురా ♦ జ్యంబునంది
మఱియు నారవ విజయుఁడై ♦ మహితశక్తి
నిర్వదైదేండ్లు వేంగినీ ♦ నృపతియేలె. 1

* పట్టాభిషేకము.

అవని పాలింప నారాట ♦ మధికమైన
వరుస దాయాదు లందఱు ♦ వైరులగుచు
పరనృపుల నాశ్రయమునకై ♦ పాలుపడఁగ
నితని కాలాన యుద్ధముల్ ♦ హెచ్చిపోయె. 2

నరవరుని దమ్ముఁడైన దా♦నార్ణవుండు
రాష్ట్రకూటులు సాయంబు ♦ రానెదిర్చె
నట్టి రణరంగములలోన ♦ నతనిపుత్రు
లితని పుత్రులు హతులైరి ♦ యెట్టి యఘమొ. 3

రాష్ట్రకూట నృపాలుండు ♦ కృష్ణరాజు
వేంగిపై దాడివెడలిన ♦ వీకతోడ
నష్టగజముల జంపె నా♦యాజినృపతి
గాని యందోడియును కళిం♦గమున కేగ
శబరనాయకుల్ వల్లభ♦సైన్యములును
సప్తవర్షముల్ దిరిగిరి ♦ జనపదముల. 4

మంగినృపుఁడు పన్నెండేండ్లు ♦ మహినియేల
నతనిఁ దొలఁగించి శత్రువు ♦ లాక్రమించి
నంత మూడేండ్లు పోరి ♦ జయంబునంది
మరల* బట్టాభిషిక్తుఁడై ♦ తరలెనతఁడు. 5

పట్టవర్ధన బొద్దియ ♦ బాహుబలుఁడు
దేశరట్టోడి మాదిఞల్ ♦ దిరుగుచుండ

* ఇది శక 880లో జరిగెను.

రాజ్యరక్షకై పాంబట్టు ♦ గ్రామమొకటి
పొందువను గ్రామము నొసంగె ♦ పుడమినేత. 6

కొలను నాయకుండు ♦ గుణనిధి నృపకాముఁ
డధిక వీర్యబలుఁడు ♦ నగుచు నైదు
గురిని యోధవరుల ♦ గురిజేసి యొకవ్రేటఁ
దనదు సేనలకు ము♦దంబు గొలిపె. 7

శూరవరుఁడు బాలాదిత్య ♦ సూనుఁడైన
యట్టి నృపకాము కొమరిత ♦ న్యాయమాంబ
నమ్మరాజు బెండ్లాడెను ♦ సమ్మదమున
గండనారాయణుఁడు వాని ♦ దండిసుతుఁడు
నతనివలెనే ప్రసిద్ధుఁడై ♦ యలరుచుండు. 8

గాని యాతఁడు నృపునితో ♦ గతుగట్టి
బాదపుడు, తాలపులతోడ♦బనివినియెను
మేటిహాయగజరాజముల్ ♦ధాటినెక్కి
యుద్ధరంగంబులందు బ్ర♦సిద్ధుఁడయ్యె. 9

శైవదేవళముల ♦ జైనాలయంబుల
పోషణకు నృపుండు ♦ భూములొసఁగి
పెక్కుగ్రామములను ♦ విప్రవర్యులకిచ్చి
విద్యలను మతంబు ♦ వృద్ధిపఱచె॥ 10

జైనమత నందిగచ్ఛన్వ♦శంబుగాంచి
నట్టి దిననందిముని ప్రశి♦ష్యత్వమున ది
వాకరుని ఛాత్రుఁడగుచు దే♦వళమునందు
దివిరి యర్చించు మందిర♦దేవమునియు. 11

కలరు బోధవరులు ♦ కాలాముఖమఠంబు.
శాఖలందు పెక్కు ♦ స్థలములందు.
దేవళములలోన ♦ దీక్షగా నివసింత్రు
గురువులామతంబు ♦ కొఱకు నెపుడు. 12

విజయవాడ శైవాలయ ♦ విధులకొఱకు
నన్నసత్రంబు జరుపఁగా ♦ నమితభక్తి
నాల్గుగ్రామమ్ముల నొసంగె ♦ నరవరుండు
తాడికొండాది కండేరు ♦ వాడియుందు
ముదముపడ శైవగురుఁడు ప్ర ♦ భూతరాశి. 13

శైవమఠమునకును ♦ శైవాలయమునకు
జాతిగుడులమర్చి ♦ క్రమముపఱచె
యా ప్రభూతరాశి ♦ యర్చనాకైంకర్య
నిత్యవిధులఁగొన్ని ♦ నియమములను. 14

కలుచంబఱ్రను గ్రామము
మలియంపూడియును జైన ♦ మతపోషణ దే
వళములకిడి ఖ్యాతిఁగనె
చలికివిభుండమ్మరాజు ♦ సంతసమొప్పఁగ. 15

కార్పటీవ్రతంబు* ♦ క్రమముగ నొనరించు
బ్రాహ్మణులకు దొమ్మ ♦ పండితులకు
నగ్రహారములుగ ♦ నర్పించె మాగల్లు
పదకల్లూర్ల భూమి ♦ ప్రభువరుండు. 16

* త్రిరాత్ర ఉపవాసము.

విజయవాడలోన ♦ విద్యేశ్వరుండను
శైవగురువుప్రాయ ♦ శాసనంబు
నట సమస్త భువన ♦ యాశ్రయ దేవళ
మునకొసంగె దాన♦మును నృపుండు. 17

పట్టవర్ధన కులభోగ ♦ భార్యయైన
చామెకాంబ కోరికపైన ♦ గ్రామమొసఁగె
జైనమత ధర్మనందికి ♦ జనవరుండు
ఉభయమతపోషకుండని యభినుతింప. 18

గుండుగోలనున పన్నెండు ♦ ఖండికలను
వామనుండను నొక ♦ విప్రవరునకిచ్చె
భట్టదేవుడన్ కవిచక్ర♦వర్తి శాస
నమ్ము రచియించె ప్రభునాజ్ఞ♦సమ్మదమున. 19

కుప్పనార్యుఁడనెడి ♦ కూర్చుసామంతుఁడు
మంత్రివర్యు కోర్కె ♦ మదినెఱింగి
గ్రామమొక్కటిచ్చె ♦ గరుణ ద్రాక్షారామ
మందతండు గట్టె ♦ యాలయంబు. 20

రాజవిషయ అధ్యక్షుడై ♦ రాణకెక్క
పాండురంగ ప్రపౌత్రుఁడు ♦ బాహుబలుఁడు
కమ్మరాష్ట్రంబు పాలించు ♦ ఘనుఁడుదుగ్గ
రాజుగోర్కి మయూరశ ♦ ర్మ యనునతని
మంత్రికిని గొన్ని భూముల ♦ మాన్యమొసఁగె. 21

ఎరియనామాంకితుని పుత్రు ♦ డిలబ్రసిద్ధి
గన్న తాళ ర్త్యగుండనా ♦ ఖ్యప్రభువరుఁడు
రాష్ట్రకూటుండు నతవాటి ♦ రాజ్యమేలు
నీనృపాలు సామంతుఁడై ♦ యెసఁగుచుండి. 22

సలికేశ్వర దేవుని క
త్తిలినాట నొసంగెభూమి ♦ పృథివీపతియా
స్థలి బాలసోమపండితు
నలరంగానుంచి దేవ ♦ తార్చన సలుపన్.   23

కవులను బోషించుచు మరి
కవిగాయక కల్పతరువు ♦ ఘనబిరుదముతో
భువినేలినంత దానా
ర్ణవుఁడును బాలనకువచ్చె ♦ రాజసమొప్పన్.   24

---

## దానార్ణవుఁడు (970*-973)

రాజనారాయణుండన ♦ రాణకెక్కి-
తమ్ముఁడైన దానార్ణవ ♦ ధరణి విభుఁడు
శాలివాహనశక మష్ట ♦ శతముదాటి
తొంబదియురెండు యేండ్లకు ♦ దోర్బలమున
వేంగి సింహాసనంబెక్కె- ♦ వేడుకలర.   1

---

* పట్టాభిషేక కాలము

ఘనుఁడగు కళింగభూపాలు ♦ దనయయైన
యూర్జపాయను దేవికి ♦ నుదయమయ్యె
నితఁడు చాళుక్యభీమ న♦రేంద్రునకును
దాన వారసుఁడై వేంగి♦ధరణి గొనియె. 2

మల్లరాజును గొండియ ♦ మాన్యవరులు
వాసికెక్కిన ముదిగొండ ♦ వంశజులయి
తనకు దోడ్పడ నాజినా ♦ దర్పమెంచి
రాజలాంఛనములతోటి ♦ రాణమెరయ
మూడునూర్ల గ్రామములిచ్చి ♦ మోదపరచె
నవియు బొత్తపినాడుగా ♦ నలరుచుండు. 3

కలివిష్ణువనెడి బిరుదము
సలలితముగ వేసధరించి ♦ జనపతి మూడేం
డ్లిల బాలించిన యంతట
గలిగెను రాజ్యమున బెక్కు ♦ కల్లోలంబుల్. 4

## బాదపరాజు (973–999)

బాదపుండను విభునకు ♦ బావమఱఁది
వీరజట చోడభీముఁడీ ♦ నృపునిఁజంపి
సాయపడుచుండ పాలనా ♦ సమరములను
నిర్వహించె దేండ్లు బాదపుఁ ♦ డేలఁగలిగె.

బంధువులును దాయాదులు ♦ బాహుబలము
జూపి యెదురించుచుండిరా ♦ సమయములను
రాష్ట్రకూట వల్లభకృష్ణ ♦ రాజుకూర్మిఁ
బాదపుండమ్మరాజును ♦ బారఁద్రోలె. 2

వీరయోధ గజాశ్వౌండ ♦ పారబలుఁడు
గండనారాయణునకిచ్చె ♦ గ్రామమొకటి
తనదు సేనాధిపతియటాట ♦ ధరణివిభుఁడు
ప్రీతితోడ నారుంబాక ♦ పేరుగలది. 3

తెలుగు చోడరాజులలోన ♦ ధీరవరుఁడు
వీరజటచోడభీముఁడా ♦ నృపవరునకు
సోదరిని బాదపరాజు ♦ మోదమొప్ప
బెండ్లియై పేరుగాంచెనీ ♦ పృథ్విలోన. 4

మకరరాజను పల్లవ ♦ మల్లవంశ
ముఖ్యుఁడీనృపునైన్యాల ♦ ముందునిలిచి
ఘోరరణరంగములఁ బోరి ♦ వీరమరణ
మొంది ప్రఖ్యాతి వహియించె ♦ నుర్విలోన. 5

తాలపుఁడు యుద్ధమల్లు నా♦ధరణివరులు
యీనృపుని కాలమున గొంత♦యేలిరంద్రు
ఈనరేంద్రుని పాలన ♦ నెంచకుండ
శత్రులిది యరాచకముగ ♦ జాటినారు. 6

తాలపనృపుండు పాలించు♦ధరణిలోన
కుప్పయకు రెండుగ్రామాలు ♦ గూర్మినొసఁగె

మంత్రి సామంతుఁడై యొప్పి ♦ మకరరాజ
తనయుఁడై రాజసేవను ♦ ద్దండుఁడగుట. 7

## బేతవిజయాదిత్యుని వంశము (928-1123)

బేతనరపాలుఁ డంతట ♦ పిష్ఠపురము[1]
నందు బాలించె సామంతుఁ ♦ డగుచుగొన్ని
యబ్దములు నావిభునకు స♦త్యాశ్రయుండు
ననెడి కొమరుండు జనియించి ♦ యచట నేలె. 1

గాంగవంశజు రాలగు ♦ గౌరికన్య
నతఁడు బెండ్లాడి ముదముతో ♦ నంతఁ గాంచె
తనయునిఁ విజయాదిత్య ♦ ధరణివరుని
నతని తర్వాత విభుఁడయ్యె ♦ నాపురాన. 2

## శక్తివర్మ I (విష్ణువర్ధన) (999-1011)

సరవి దానార్ణవ సుతుండు ♦ శక్తివర్మ
ప్రబలుఁడై బాదపునిజంపి ♦ రణములోన
వేంగి బన్నెండు వత్సరాల్ ♦ వీకతోడ
నేలినాడు దాయాదుల ♦ నేపడంచి. 1

* నేటి పిఠాపురము.

నృపతి చాళుక్య భీముఁడన్ ♦ బిరుదు దాల్చి
వసుధ బాలించునపుడు వ్యా♦పార మెంతొ
వృద్ధియై యరకాన్సయాం ♦ దేశములకు
బంపె బంగరునాణెముల్ ♦ వస్తువులకు. 2

ఎరియ భూపాలుఁ డనుపేరఁ ♦ బరగుచు వెల
నాడు బాలించు సామంత ♦ నరవరుండు
శత్రువులతోడి రణములఁ ♦ జయముగాంచి
మేటి విశ్వాసపాత్రుఁడై ♦ మెలఁగుచుండు. 3

రాజరాజచోళ ♦ రమణుండు సాయమై
రాఁగ శక్తివర్మ ♦ ప్రబలుఁ డగుచు
సంగరంబునందు ♦ జటచోడ భీముని
దరిమి సమయఁ జేసె♦దర్పమొప్ప. 4

వేంగిలో క్రీస్తుశకమున ♦ వేయినారు
వత్సరమున నాహవమల్ల ♦ ప్రభువరుండు
వచ్చి తనయాధిపత్యముం ♦ బ్రబలజేయఁ
కంచి చోళేశ్వరుఁడు దీనిఁ ♦ గాంచి వేంగి
పైకి వచ్చిన నితఁడును ♦ బ్రతిఘటించె
నంత వెనుకకు వీరు ని♦శ్చింత జనిరి. 5

ఆర్యమాదేవి సుతుఁడయి ♦ యలరు నితఁడు
బాల్యమున చోళరాజుల ♦ బవరములను
యుద్ధగజములఁ గొన్నిఁటి ♦ నోర్చి చంపి
వీరుఁడై పేరుగనెనఁట ♦ పృథ్వియందు. 6

## విమలాదిత్య చక్రవర్తి (1011*-1022)

ఆర్యమాదేవి దానార్ణ ♦ వధిపతికిని
సూనుఁడై విమలాదిత్య ♦ శూరుఁడంత
వేంగిసింహాసనం బెక్కి ♦ పృథ్వినేలె
పదియునొకవత్సరంబును ♦ బ్రతిభఁ జూపి. 1

కరికాల వంశ్యుఁడౌ ♦ కాంచీపురేశ్వర
రాజరాజల్లుఁడై ♦ రాణకెక్కి
బలపరాక్రమశాలి ♦ వజ్జియప్రెగడకుఁ
గ్రామ మొండిచ్చిర ♦ ణస్థిపూడి
త్రైకాలయోగి సి♦ద్ధాంతదేవునికిని
శిష్యుఁడై జైనంబు ♦ వృద్ధిఁ జేసి
ముమ్మడిభీముఁడై ♦ భూపమహేంద్రుఁడై
చాళుక్యచంద్రుఁడై ♦ సంచరించి

సర్వలోకాశ్రయుండాది ♦ సకలవంశ
బిరుదముల్ దాల్చి యీతఁడు ♦ విష్ణువర్ధ
నుండనఁగ బేరు జెంది యీ ♦ యుర్వినేలె
శాంతిమై విమలాదిత్య ♦ చక్రవర్తి. 2

చోడభూపతి రాజరా ♦ జునకు జనన
మందినట్టిది సుందరి ♦ కుందవాంబ
నతఁడు వైవాహికంబౌట ♦ నధిపతికిని
వేంగికిని స్నేహభావంబు ♦ వృద్ధియయ్యె. 3

* పట్టాభిషేకకాలము

వీరికిని రాజరాజను ♦ సూనుఁడుద్భ
వించి సద్గుణవంతుఁడై ♦ వేంగిరాజ్య
పట్టభద్రుఁడై పేరొంది ♦ ప్రజల నేలె
నీనరేంద్రుఁడు పరలోక ♦ మేగినంత. 4

రాజరాజచోడ ♦ రమణుని మాడలు
నాణెములను ♦ వేంగినరపతియును
వాడఁజొచ్చిరంత ♦ ప్రజలును వేంగిలో
నాధిపత్యసరణి ♦ నాలకించి. 5

మలయమున సూర్యవంశజుల్ ♦ మాన్యులగుచు
ధరణి నేలుచు సామంత ♦ నరవరులయి
యీనృపాలుని రాజ్యాన ♦ నెసఁగుచుండి
కర్ణ, యెర్రప, చోడప ♦ కామనృపులు
మొదలుగా నార్వురుండిరి ♦ విదితయశులు. 6

కుడ్యవర్మనృపతి ♦ గోరిన నిచ్చెను
పాలనకును గుద్ర♦వార ద్వయము
విమల నృపవరుండు ♦ వెలనాటి రాజ్యాన
నతని సాయమెంచి ♦ యన్నిదిశల. 7



## రాజరాజనరేంద్రుఁడు (1022* – 1061)

రాణిగా వరియించి ♦ రాజేంద్రచోళుని
తనయ నమ్మంగను ♦ వనిత నెలమి
ఆంధ్రభాష కలంకృ♦తమ్మైన భారతా
మ్నాయంబు వ్రాయించి ♦ మహితశక్తి
నన్నినారాయణ ♦ నన్నయభట్లను
కవిచక్రవర్తుల ♦ గౌరవించి
యగ్రహారము లిచ్చి ♦ యట్టులే విద్వాంసు
లందఱి బోషించి ♦ యాదరించి

పోటుమన్నీలు మువురు క♦ర్నాటయుద్ధ
మందు జనిపోవ వారల ♦ యాఖ్యలుంచి
మూఁడు దేవళముల గట్టి ♦ ముదముతోడ
నంత కల్దిండి, కడపట్లు ♦ నావకూరు
గ్రామముల మూఁడు గానుక♦గా నొసంగె
రాజరాజనరేంద్రుండు ♦ పూజితుండు. 1

సత్రమొక్కటి నిర్మించి ♦ శాస్త్రవిద్య
లభ్యసించెడివారు వి♦ద్యార్థు లేబ
దికిని భోజనములఁ బెట్ట ♦ దినదినంబు
దేవపూజలఁ గావించఁ ♦ దిట్టపరచె. 2

వెలనాటి నన్నచోడుఁడు
కలిగిన సామంతులందు ♦ ఘనుఁడన బరగె

---

* పట్టాభిషేకకాలము.

దెలుఁగులలోఁ గర్ణాటకు
లిలపై దండెత్తి నప్పు ♦ డెదిరించఁ బ్రభుఁ. 3

తమ్ముఁడౌ విజయాదిత్య ♦ ధాత్రిపుండు
నితని రాజ్యంబు తా నాక్ర ♦ మించి నంత
మరల రాజేంద్రచోళుని ♦ గరుణవలన
పారఁద్రోలియు రాజ్యంబు ♦ బ్రతిభఁ గొనియె. 4

అష్టభాషా ధురంధరుఁ ♦ డైన నన్న
యార్యుఁ డా రాజశాసనా ♦ లములు కొరకు
రచన జేయుచునుండఁగా ♦ రాణకెక్కె
రాజరాజనరేంద్రుఁ డీ ♦ రాజ్యమందు. 5

ఆంధ్రశబ్దచింతామణి ♦ యనునిఘంటు
వొండు రచియించె నన్నయా ♦ ర్యుండు ఘనుఁడు
దేశికవితకు నిదియెన్నొ ♦ తీరులరసె
తెలుఁగు సంస్కృత భాషలు ♦ కలియునట్లు. 6

సంస్కృతాంధ్ర కర్ణాటక ♦ సాహితీస్ర
వంతి పైశాచి ప్రాకృత ♦ భాషలెఱిఁగి
పండితుండు నారాయణ ♦ భట్టు సాయ
పడఁగ నన్నయ రచియించె ♦ భారతంబు. 7

ప్రథితయష్టాదశావధా ♦ రణకవిత్వ
మును కవీభవజ్రాంకుశ ♦ ఘనబిరుదము
నన్నయార్యునకుఁ సరి ♦ మన్ననలను
బడసినాడు నారాయణ ♦ భట్టొకండె. 8

తెలుఁగు దేశంబు నేలెడి ♦ తెలుఁగు ఱేఁడు
తెలుఁగుసీమఁ గోరికగల ♦ దేశికవిత
తెలుఁగు బాసలోఁగానని ♦ దివ్యకథలఁ
దలఁచి వృద్ధియొనర్చెను ♦ తెలుఁగువాణి. 9

సంస్కృతంబును బోషించి ♦ సద్యశంబు
బొందునప్పుడె మాళ్వలో ♦ భోజరాజు
తెలుఁగు భాషను పోషించి ♦ తేజరిల్లె
రాజరాజనృపుం డాంధ్ర ♦ భోజుఁ డగుచు. 10

చీడమార్యునకును ♦ చిరయశస్వి నృపుండు
కోరుమిల్లియూరు ♦ గోర్కె మీఱ
గణితవిదుఁ డటంచు ♦ గరిమ నందంపూడి
పావులూరి మల్ల♦వరున కొసఁగె. 11

ధరణికోటనేలు ♦ దర్పంబునన్ కోట
బేతరాజు పుడమి ♦ నృపుని పేర
కొరుబోయ యనెడి ♦ ఘనుఁడు పర్వడి రేవ
యనెడి యోధవర్యు ♦ లాప్తులుగను. 12

భూరమణుఁ డంత యొసఁగెను
నారాయణభట్టునకును ♦ నందంపూడిన్
గోరిక లీరికలెత్తఁగ
సారస్వత సేవలో ర♦సజ్ఞుం డనుచున్. 13

ఒక్క సూర్యోపరాగాన ♦ నుత్సహించి
యంకయార్యునకున్ భక్తి ♦ నగ్రహార

భూముల నొసంగె నల్బది ♦ పుట్లుపైన
మండయను గ్రామమందున ♦ మనుజవిభుఁడు
నన్నయకవీంద్రుఁ డీశాస♦నము రచించె. 14

వేయి యేబదిమూడులో ♦ వేంగి పృథ్వి
చవికి సోమేశ్వరుఁడు గొని ♦ సాహసమునఁ
బాలనము సేయఁదొడఁగ నీ♦ప్రభువరుండు
చోళరాజేంద్రు సాయాన ♦ జుట్టుముట్టి
వెడల నడచియు రాజ్యంబు ♦ వీకఁ గొనియె. 15

నంబిరాజు పరిచ్ఛేది ♦ నాయకుండు
వెలయు నోంగేరు మార్గంపు ♦ విషయమునను
రాజరాజుని సామంత ♦ ప్రభువరుండు
గండఁ డాతని పుత్రుండు ♦ దండిమగఁడు. 16

ఆగిపోయె రచన ♦ యాంధ్రభారతమున
మూడు పర్వములకు ♦ ముందు నడచి
కన్నడులకు తమిళ ♦ కాంతుల కీభూమి
యుద్ధరంగములుగ ♦ నుండునపుడు. 17

కష్టసుఖములలో నిట్లు ♦ కాలుబెట్టి
నలుబదియు నొకవత్సర ♦ మెలమి నేలి
వేంగిలో బ్రాహ్మణమతంబు ♦ వృద్ధిజేసి
తెలుఁగు నాటను తనపేరు ♦ నిలుపుకొనియె
తలఁప నాఁటికి నేఁటికి ♦ ధాత్రిపుండు. 18



## శక్తివర్మ II (1061-1062)

రాజరాజు మృతింజెంద ♦ విజయభూప
తనయుఁడౌ శక్తివర్మ యీ ♦ ధాత్రినేలె
నొక్కవత్సరమంతట ♦ నుర్విఁగొనియె
నితనిపిత విజయాదిత్య ♦ నృపవరుండు.
శక్తివర్మయు నాజిలో ♦ సమసినంత. 1

అడప అప్పనార్యుఁ ♦ డనువిప్రునకు నూరు
నమియవాడనొసఁగి ♦ నుతికినెక్కె
శక్తివర్మయేలు ♦ స్వల్పకాలమునం గె
బ్రాహ్మణోత్తములకు ♦ భక్తిఁజూపి. 2



## సప్తమ విజయాదిత్యుఁడు [1062-1076]

కొమరుండు శక్తివర్మయు
సమరంబున మడసినంత ♦ సంతాపమునన్
గుములుచు విజయాదిత్యుఁడు
విమలాదిత్యవిభుసుతుఁడు ♦ వేంగిని యేలెన్. 1

రాజరాజు తనకు ♦ రాజ్యభాగంబేమి
యియ్యకున్న నతని ♦ మృతివరకును
వేచియుండి పిదప ♦ వేంగిసామ్రాజ్యము
నితఁడు బడసి దాని ♦ నేలునంత. 2

రేవల్ దేవియు నాబడు
దేవేరిని బెండ్లియాడ ♦ నృపతికి గల్గెన్
దేవియగు సోమలాంబిక
యావనితయు భీమదేవు ♦ నర్పించె దమిన్. 3

వీక పశ్చిమచాళుక్య ♦ నృపతివరుఁడు
వీరసోమేశ్వరుఁడు దాడి ♦ వెడలి వేంగి
నాక్రమించినయంతనె ♦ యధికశక్తిఁ
గొనియె రాజేంద్రచోడుని ♦ గూర్మివలన. 4

త్రిపురిపాలక యశకర్ణ ♦ దేవుఁడొకఁడు
విక్రమాదిత్య చలికియు ♦ వేంగిపైన
దాడి వెడలి జయించి య♦ద్దానిఁ గొనఁగఁ
నపుడు రాజేంద్రచోడుఁడా ♦ నృపుల నోర్చి
తిరిగి రాజ్యము నిచ్చె నీ ♦ నరవరునకు. 5

మేఘగిరి నాథుఁ డాదిగా ♦ బిరుదులు గల
నాగకుల భీమభూపాలు♦నకు నొసంగె
కొంపొలుంగను గ్రామము ♦ గోర్కి మీర
రాజ్యసంపాదనమున నా ♦ రాజరాజు
తోడిరణముల సాయమై ♦ గూడియుండె. 6

రాజమహేంద్రచోడుఁడు ♦ రడ్డికంబు
దనకు బెజవాడ నొసఁగ గే♦తనయు బల్ల
వాబ్ధిచంద్రుఁడు వీకతో ♦ నటచరించె
చోళనృపుల పెత్తనమిట ♦ జూడఁబడఁగ. 7

ఉదయగిరి ప్రాంతమున పల్లి♦వుండు దోర
రాజు వసియించి పాలించె ♦ రాణమెరయ
నానృపుఁడు "నొడువడి సహ♦స్రార్జునుఁడ"న
సమరచండప్రచండుఁడై ♦ జగతి వెలయ. 8

పంపనార్యుండనెడి యొక ♦ బ్రాహ్మణునకు
మావిడేరను గ్రామముఁ ♦ భక్తి నొసఁగి
పదియు నైదేండ్లు కడగండ్ల ♦ పాలఁబడుచు
విజయభూపతి బాలించె ♦ వేంగి నంత. 9

చోళచాళుక్య వంశాల ♦ మూలకుఁడన
రాజరాజున కమ్మంగ ♦ రాణివలన
సూనుఁడై యొప్పి రాజేంద్ర ♦ చోడుఁడనెడి
యాకులోత్తుంగ చోడుఁడీ ♦ యవని గొనియె. 10

వినుత చాళుక్యరాజ్య మీ ♦ విధము నాల్గు
వందలకు పైన నర్వది ♦ వత్సరాలు
చెల్లె నాంధ్రమహీస్థలి ♦ వెల్లివిరియ
కీర్తిచంద్రికల్ సతతము ♦ బృథ్వియందు. 11

వివిధ దేవళములలోన ♦ వెలుగు నిత్య
దీప్తదానములం జేసి ♦ తెలుఁగువిభులు
ప్రజలు పండుగ వేళల ♦ భక్తిఁ జూపి
సంచరింతురు కోరికల్ ♦ సంతరింప. 12

నిత్యదీపంబులకు గొంత ♦ నేతినొసఁగ
గొర్ల గోవులమందల ♦ గూర్చి యొసఁగి

దేవరల, బోయలకు వాని, ♦ దేవళముల
శిలలపై శాసనంబుల ♦ జెక్కుచుంద్రు. 13

నైవేద్యము లాభరణము
లవిరళ పూజాదికముల ♦ నర్చింతురు భూ
ధవు లొసఁగఁగ మాన్యంబులు
వివిధమహేశులకు నెప్డు ♦ విప్రజనంబుల్. 14

వెలయించుచు బృందావన
ముల పలువిధ కుసుమజాతి ♦ పుష్పించంగా
నలఘుతర భక్తితోడుత
మెలగుదురట భక్తవర్యులు ♦ మేటిగుడులలో. 15

దుర్ముఖి గాంధిజయంతికి
నిర్మాణము పూర్తియయ్యె ♦ నిఖిలాంధ్రజనుల్
పేర్మిని జదివి పఠింపఁగ
నర్మిలి చాళుక్యరాజ్య ♦ నానాచరితల్.

మహాత్మాగాంధిజయంతి
2—10—56

కొత్త భావయ్యచౌదరి

జానకీరాంప్రెస్, తెనాలి.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 2 | పిత్రు | పితల |
| 11 | 17 | సాంద్ర | సాంధ్ర |
| 15 | 11 | పూర్వపు | పూర్వ |
| 15 | 16 | లున్నది | లున్నవి |
| 16 | 5 | సూనుఁడే | సూనుఁడో |
| | 7 | యొన్మిది | యెన్మిది |
| 43 | 6 | చవికి | చలికి |

## మా ప్రచురణలు

| | |
|---|---|
| దేవరహస్యాలు | 2–0–0 |
| కమ్మవారిచరిత్ర (ప్రథమభాగము) | 2–0–0 |
| ధర్మనందన విలాసము (కాళ్లకూరి గౌరీకాంతకవి) | 2–0–0 |
| కల్పవల్లి ... ... | 1–0–0 |
| కాశ్మీరదేశచరిత్ర ... | 1–0–0 |
| రెడ్లచరిత్రము ... | 0–8–0 |
| కాకతీయరాజ చరిత్రము | 0–8–0 |
| ప్రబోధకుసుమావళి ... | 0–8–0 |
| A Brief History of Kammas | 1–0–0 |
| వేంగీ చాళుక్యరాజ్య చరిత్ర ... | 0–8–0 |
| శంకర, గోపాలశతకములు ... | 0–2–0 |
| సగరపట్టాభిషేక నాటకము ... | 0–8–0 |

కొత్త భావయ్యచౌదరి, సంగంజాగర్లమూడి. (P. O.)
(గుంటూరు జిల్లా)